పుటని చావనిది వృద్ధిపొందనిది బకటపడనిది వృష్టిపుట్టికైన మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే మాయావరణం వుండంగా యంత వారికి తనకుతానే తీసివేసుకొనేట దుకు శక్యంకాదుగనుక జ్ఞానమనే భ్రాంతి చేత యిచ్ఛావిస్తారం వుంచుంది. కొంత కర్మాలు ఆచరిస్తు వుంచారు. ఇంతేకాని శరీరంలేని గురుసాంప్రదాయం వున్నది అని యెరుగకా అద్వైతమనే అడవిలో పులిని దొరికించుకొన్నట్టు దొరికించుకొని గుర్తెరిగే సచ్చిదానందం నేను అని అనుకుంచూ మునుపటికంటే రాగద్వేషాలు అధికమై ఆడివిపట్టి శరీరమనే గృహాలో పెద్దపులివలె గుర్తెరిగే చైతన్యం నేను అని లెస్స గుర్తెరిగి ఆవులు రాంగానే ఆవులని గుర్తెరిగి కదలక మెదలక గుండుకింద నతికి తప్పిన పశువును దొరికించుకొని ఫలహారం చేస్తున్నట్టు యీ శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేను అని నిశ్చయంగల వారు ప్రజల క్లేశపెడుచు వుంటారు.

చైతన్యం చేయదు, చేయించదు అనుకుంచు సర్వం గుర్తెరిగి తర్వాత చేస్తువుంటాడు.

మధ్యమధ్య నాకు కర్తృత్వం లేదు అనుకొంచు.

శంకరాచార్యులు వారి సిద్ధాంతం దొడ్డది దొడ్డది అనుకుంచూ నరకం అనే శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేనుఅనుకొని నమ్ముకొని పుట్టలో పామువలె వకవేళ పెట్టలో పామువలె హోవేళ్ళ భుస్సభుస్స మను కుంచూ కాలం గడిపేవారు.

యెవ్వరైన వక పెద్దలు యేమీలేదు. సర్వం వుపాధికర్మం నేను అసంగుణ్ణి కర్మలు మిథ్య లేనేలేవు. అవిద్యా కార్యాలువి హితమైన కర్మాలు విడువరాదు. మనకు కావలె లోకసంగ్రహార్థం నాకు వున్నా సరే లేకున్నా సరే. చెయ్యకపోతే నలుగురు నెత్తికొడుతారు. అసంస్కారులు కొందరుమాత్రం పనికిరాదు అని అంటారు.

కాశికి పోయినమాత్రమే యెక్కువ.

గోదావరికి పోయినమాత్రమే యెక్కువ.

కృష్ణకు పోయినమాత్రమే యెక్కువ.

రామేశ్వరం పోయినమాత్రమే యెక్కువ.

గోవులది యెంతో దొడ్డ పుట్టుక.

గోవులను మించిన పవిత్ర వస్తువు లేదు.

గోమూత్రం యెంత దొడ్డని వేదాలకంటె, గుత్తెఱిగే చైతన్యము కంటె దొడ్డది. యీ గుత్తెఱిగేది గోమూత్రం త్రాగితేకాని పవిత్రం కాదు.

బ్రాహ్మణుడు గోవుకంటె తక్కువ.

వీడేమోయి ద్విపాద పశువు. యంత గుత్తెఱిగే చైతన్యం అనుకున్నా గోమూత్రంవలె పనికివస్తుందే ఛీ గోమూత్రం యెక్కడ బ్రాహ్మణుడు యెక్కడ మూత్రమేకాని పురీషం పనికిరాదు. పంచగవ్యంకంటె పవిత్రం యేదిలేదు గోవుల పురీషం పనికివస్తుంది. తిన్నదళ్ళా అన్నమే. వెళ్లినదళ్ళా పురీషమేకాని మనిషిది, భ్రష్టుది, గోవులది, బర్లది, యెడ్లది, దున్నపోతులది, మేకలది, గొర్లది పనికివస్తుంది. యిందులో గోవులది శ్రేష్ఠం అని శాస్త్రం (వేద) తెలిపించింది, మూత్రపానం చేయించింది. శాయరానివి యెన్నవున్నవో అన్ని శాస్త్రాలచాత మూలంలేని యీ గుత్తెరిగే శరీరమే చేసింది

పుట్టని చావని యీ బట్టబయలు యేమి చెప్పలేదు. యేమి చెయ్యదు. సార్వకాలం వక్కటీరే.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరం తోచకమునుపు కేవలం బట్టబయులే వున్నది. ఆ బట్టబయులు ప్రవేసించదు. వెళ్ళిపోదు. యీ బట్టబయలులోనే అనేక శరీరాలు వస్తావి. తనకుతానే వుంచావి, తనకుతానే యేమీలేదు.

పుట్టని చావని బట్టబయలుకు జ్ఞానంలేదుగనుక కర్మాలు పుట్టనే పుట్టవు.

జ్ఞానకర్మాలు శరీర జన్యాలు.

క్షేత్రానకు క్షేత్రజ్ఞ స్వరూపానకు భేదం లేదు.

కార్యకారణాలకు భేదం లేనేలేదు.

వచ్చిన శరీరాలు జ్ఞానంతోకూడ వచ్చినవి. జ్ఞానంతోకూడ యేమీలేదు గనుక జ్ఞానకర్మాలు లేవు.

యీ బట్టబయలుకు రాకడలేదు పోకడాలేదు.

సార్వకాలం వక్కటేరే గనుక యీ బట్టబయలే క్రియాశూన్య మయినది.

యీ బట్టబయలే పుట్టని చావనిది.

యీ బట్టబయలుకు శరీరం వున్నదని తోచాతోచదు.

శరీరం లేదు అని తోచాతోచదు.

చేసేవారికి అన్ని తోస్తావి.

శరీరం నేనుఅని చేసేవారికి తోస్తావి.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదుఅని యీలాగంటే యీలాగు చేసేవారికి అన్ని తోస్తావి యదార్థంగా.

కలలో వచ్చిన యేనుగు మేలుకుంటే యీలాగు యేమీలేదో యీలాగే యీ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేక వున్నవారికి తోచేటందుకు మూలం యేమీలేదు. వారిది వారికే తెలియవలెగాని యితరులకు శఖ్యంకాదు. వారితోకూడ వుంఢిచూడవలె. వారి జాడ కనుక్కోవలెగాని లేకుంటే తెలియదు. యిది మహారస్యం. యీలాగు వున్నవారికి యిచ్ఛకు మూలంలేదు. యే నిర్ణయం చేసేటందుకు మూలం యేమీలేదు. వున్నది వున్నట్టుండే. యిటువంటివారే భ్రాంతికి మూలం లేనివారు.

వుపాధినుంచి అన్ని తోచివుండే.

యీ శరీరోపాధినుండి అన్ని పాయ.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోచినప్పటినుంచి భ్రాంతి పుట్టింది.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కలలో వచ్చిన మనుష్యులు మేలుకుంటే యేలాగులేదో ఆలాగే శరీరానకు మూలం యేమీలేదు.

వున్నపుడు తన సత్తా తనకుగాని పుట్టని చావని బట్టబయలు యీ శరీరాన్ని పుట్టించిందికాదు. విడువ విడువదు.

యీ శరీరం తనకుతానే మధ్యవచ్చి మధ్యపొయ్యేది.

యీ బట్టబయలు శాశ్వితమయింది.

మొదలు కొన లేదు.
రాకడా లేదు పోకడా లేదు.
పుట్టుకా లేదు చావులేదు.
మరుక లేదు కర్మాలు లేవు.
వకటయినా వికారం లేదు.
యిచ్చ యెన్నటికిలేదు.
శరీరం లేదుగనుక చలించనే చలించదు.
యీ కలలో శరీరం తోచంగానే వెంటనే క్రియాసిద్ధం.
మాటలచేత కనబడదు.
సాధనలచేత కుదురదు.

యిది యేలాగుఅంటే కలలో కొన్నికోట్ల ప్రజలు వచ్చినా వున్నా అనేక చిత్రవిచిత్రాలు చేసినా అనేక పుణ్యాలు చేశినా అనేక మహాపాతకాలు చేశినా యెంత భాగ్యవంతులు అయినా దరిద్రులు అయినా యెన్ని యేనుగలు వున్నా యెందరు కొమాళ్లువున్నా అనేక గోవులున్నా అనేక మొహారీలు మూలను రాసులు వున్నా యంత చదువుకున్నవాడు అయినా కొత్తగా శాస్త్రాలు చేశేవాడుఅయినా వెంటనే మేలుకుంటె యేమీలేదు అని తనకుతానే యే సాధన చెయ్యందే యేలాగు ధృఢం వున్నదో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కొంచమయినలేదు.

సాధన చెయ్యందే ధృఢం వుండెనా వాడే పుట్టని చావని బట్ట బయలు.

వానికి వకటైన వుపద్రవంలేదు.
సార్వకాలం వకటీరే
యెన్నికోట్ల శరీరాలు వున్నా యీలాగే.
నోట అనేటందుకు యీమాత్రం శరీరం లేదుగనుక నోరు యేలాగు వుండి.
యిదే భ్రాంతికి మూలంలేని రాజమార్గం.
సార్వకాలం వకటీరే.

శిష్యు॥ అయితే యిటువంటివారు కదలరా మెదలరా భోం చెయ్యరా యేలాగువుంటారు ?

గురు॥ తెలవచ్చినమనుష్యులు మేలుకొంటె యేలాగువుంటారుయేమి.

శిష్యు॥ యింతకు యేమిలేదు సర్వశూన్యం అరచేతిలో బట్టబయాలు వున్నటువున్నది. ప్రజలు లేనేలేరు గనుక వ్యవహారమేలేదు.

గురు॥ యావత్తు ఆ శరీరాలు యేలాగు యేమిలేదో అలాగే యీ మూలంలేని గుతెరికే శరీరం యేమిలేకుండ విచారించు.

విచారిస్తె అది యిది సమమే.

నోట ప్రసంగాలు మొదలుపెడితే బడి చదువు చదువుకో.

శాస్త్రాలు చదువుకో.

అనేక యజ్ఞాలు చెయ్యి.

చేయించు.

మహా పెద్దలు అనిపించుకో.

కుక్కలవలె మొరుగు.

గాడిదవలె కుయ్యి.

పందివలే చూచిందల్లా తెగబడి తిను.

ఆవుల వుచ్చతాగు.

పేడ తిను.

కాశీ రామేశ్వరం పో.

తీర్థాలు చేస్తూవుండు.

కొనకు కుక్కకు యేమిగతో నీకు ఆ గతే.

యీ భ్రాంతిలేని రాజమార్గం సాధనలచేత సాధ్యంకానిది.

విచారించాత అతి సులభం అయింది.

మొద్దు గాడిదకొడుకులకు రెండు మొద్దులు ముందరపెడితే రేయింబవలు కుంచూ వుంచారు.

మొద్దులకు మొద్దులే గతి.

మహా ఆస్తికులకు అతిసూక్ష్మ ప్రజ్ఞానంతులకు దృష్టాంతం యేలాగు

వున్నదో అలాగు తాత్పర్యం చేసుకొని మహాగుహ్యాం మహారహస్యం కృతకృత్యమయిన గుహ్యామని యవ్వరితో ప్రపంచముచ్చట ఆడక పారమార్థపు ముచ్చట ఆడక మహాయుక్తిచొప్పున కాలం గడిపినవాడు భ్రాంతి చేసవాడు.

యిది అద్వైతంవలె లేదు లేదుఅని యెగబడి చేసే మార్గంకాదు.

గుత్తేరిగే జ్ఞానం నేనుఅని కర్మాలు శేసేలేవు అని యెగబడి చెసే రాక్షస కృత్యం కాదు.

తత్వము దొడ్డదిఅని యిరువది అయిదోది గుత్తేరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే విద్యాస్వరూపము నేను అని చేసేది అవిద్యఅని యెగబడి చేసినట్టు కాదు.

యిరువది ఆరవది యషువంటిదో అషువంటిదాన్ని కనుకొని శాంతిచేత వున్నవాడే కృతకృత్యుడు.

శ్రద్ధామార్గం కావలశినదానికి గురుశలనాసం చెప్పినట్టు దృష్టాంతో చాల సూచన చేస్తే దార్ష్టాంతికాన్ని వుండజూచుకొని శాంతిచేత వున్నది వున్నట్టూ పడితేసరి.

కలలో వచ్చిన శరీరాలు చూస్తువుండంగానే యాలాగో అలాగే పూరాలంలేని యీ గుత్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకోవలెను.

అటుతర్వాత తాత్పర్యానకు మూలం వుండదు.

వడ్లు దంచినట్లు దంశామంటె మొద్దమ.

సాధ్యంకాదు.

అగ్ని హూత్రావలె మందిచేత మథించినట్టు కాదు.

కాశినుంచి కావడి మోసుకొని రామేశ్వరం పోయినట్టుకాదు. అప్పు చేసి అన్నం దానంచేసినట్టుకాదు.

వున్నది వున్నట్టు సడే యుక్తి కనుకొని సార్వకాలం శరీరం లేని వారిది జన్మభ్రాంతిలేని మార్గం.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే నిక్షేపావరణ ద్వయపోషరహితప్రకరణము దశమోధ్యాయః

శ్రీగురుభ్యోనమః

# ౧౧॥ క్షేత్రక్షేత్ర ద్వయదోషరహిత ప్రకరణము.

శ్లో॥ జగదాఖ్యమహాస్వప్నే । స్వప్నాత్స్వప్నాంతరంవ్రజేత్
రూపంత్యజతినోశాంత । బ్రహ్మశాం త్రిత్యబృంహితం

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని సిద్ధాంతమే రాద్ధాంతము.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకోని వున్నట్టు పడేయుక్తి కనుక్కోని సర్వకాలం శరీరం లేకవున్నవారికి జన్మభ్రాంతి లేనిమార్గం యిది. శాస్త్రాలు చదువుకున్నవారు దున్నిన యెద్దువంటివారు. వేదం చదువుకొన్నవారి నోరు దంచిన రోలు మెదిగినట్టు. మెదిగే మాత్రమేకాని దృష్టాంతంవొప్పిన దాష్టంతంగా వుండచూచుకొనే సామర్థ్యంకాదు.

యీ శరీరం యెన్ని చదువుకొన్నా చదువుకోనిది దొరకదు.

కుక్కలవలె కూసేది నక్కలవలె వదిరేది యింతేకాని కలలోయెన్ని చదువులు చదువుకొన్నా మేలుకుంటే యే చదువు లేదు. అలాగేగురుసూచన చెయ్యంగానే దృష్టాంతం తనకుతానే యేమీలేదుఅని ధృడం అయినట్టు అయి ధృడం యేమిలేకపాయెనా యెప్పటి శరీరం లేని యీ బట్టబయలు చెలించక తనకుతానే స్వతస్సిద్ధమై వుంచుంది. యీ బయలేకదా అని చూస్తువుండెనా యప్పటి కోతిచాష్టలు తప్పవు. మునుపటివలెనే (జీవాఖ్యాకురోగాధి) అనే దోషరూపం అయివుంటాడు.

శ్రు॥ జీవఃసర్వమలంజ్ఞాత్వా । జ్ఞానద్రష్టాతిముహ్యాతి॥
శ్రు॥ క్షేత్రజ్ఞాఖ్యజీవోపాధిః॥

పుట్టనిచావని అచలము తానేనని అవివేకంచాత కట్టుకొని నేను యెరుగుదును అని కర్మాలు చేస్తాడు.

శ్రు॥ సంయోజ్యం చవివేకేనజానామీతి । ప్రవర్తతేక్షేత్రజ్ఞాఖ్య ।
శ్రు॥ జీవోపాధివిలయేసతి కేవలోభవతి॥

అదే తత్వాతీతం జగత్తు తత్వస్వరూపమె తత్వాతీతం మహా గుహ్యం। పరమరహస్యం॥ అందుకే ద్వైతాద్వైతరహిత సమత్వం అనే సొజ్ఞ.

తత్వాతీతం యిదివై ఆరోది.

అదే శరీరం లేనిది.

అదే పుట్టిగిచావనిది.

అదే మొదలు కొన లేనిది.

అదే రాకడపోకడ లేనిది.

తనకుతానే స్వలస్సిద్ధమై చలించకవున్నది.

సార్వకాలం యేకప్రకారము.

శరీరం లేనిదిగనుకనే సకలదేశాలయందు జ్ఞానకర్మాలయందు భ్రాంతీ లేక వక్కటీరుగా వున్నది.

అదే సార్వకాలాలయందు మోక్షభ్రాంతి బంధభ్రాంతి లేక వకటైన వికారంలేక ప్రవేసించక వెల్లిపోక పెద్ద గుట్ట కదలకవున్నట్టు సర్వతా హట్టముగా యెడతెగక వున్నది.

అందరికీ అది కావలెనని అపేక్ష కద్దు.

దానికి యెవ్వరిమీద అపేక్షలేదు.

అందరూ నాయందే వుండి నన్ను కనుక్కోలేరు. అన్ని సాధనల చాత కట్టుబడి జ్ఞానభ్రాంతిచాత కట్టుపడి కర్మాలు తరంగాలవలె పుట్టినా కొంది తీసివేసుకుంచు దేహాభిమానంచాత గురువుఅనే మాట మాత్రిమైన తలవక సమస్తదేశాలయందు శరీరం లేకవున్న గురుస్వరూపాన్ని ఛీ అని ఛీ అని ఉపేక్షచేశి చచ్చిన గురువుల పేర్లు చెప్పుకొని లెస్సనందుకొని మా గురువు సమస్తమైన దేశాలయందు పిపీలికాది బ్రహ్మపర్యంతం సకల దేశాలలో వుండి సమస్తం భోంచేస్తాడు. అగ్ని హోత్రం వంటివాడు సమస్తం తింటాడు. సకలమయినవి తాగుతాడు. వారికి పాలువక్కటే సురా వక్కటే. వారు సకలశరీరాలలో వున్నారు. వారు గుత్తేదారిగే చైతన్య స్వరూపులు.

యిన్ని తిప్పలు పరబ్రహ్మకే గుత్తేదారిగే చైతన్యం పరబ్రహ్మగనక

గుఱ్ఱెరుగక వక్కటైనా తినకు పక్కటైన త్రాగకు సర్వం గుఱ్ఱెరిగే చైతన్యమే. యిటువంటి గురువు మా గురువు. మా గురువు అని వేషధార్లు చెప్పుకుంటారు. మా గురువు మహాదొడ్డవాడు, రామోపాసకుడు. వారి ఆచారం సార్వకాలం మడితోటే వుండేది. సార్వకాలం దంచేవాండ్లు రోకలు బుక్కుచున్నట్లు సార్వకాలం నోరు పూరికే వుండదు. యేదైన పారాయణ చేస్తుండేది. సార్వకాలం దేవునిమీద చింతే

దీపారాధన యేలాగు గడిచె.

భక్ష భోజ్యాలు యేలాగు జరిగె అని చింత.

సంసారం నెత్తికొట్టినారు.

"దేవతాశేషం క్షుదాశాంతి" అయితే సరి.

యేమయినా భక్తి దొడ్డది. జ్ఞానం వున్నది అన్న నేనేజ్ఞానం. లేదు లేదు అన్నా నేనే జ్ఞానం స్వభావికమే భక్తి దొడ్డది అని నెత్తికొట్టినారు. స్వామికి వుత్సవం నడిచితే సరి.

శిష్యు॥ యిటువంటి వేషధార్ల జోలియేమి, యీ కలలోనే అనేక వింతలు తోచిపాయె. యదార్థంగా భ్రాంతిలేని మార్గం సూచన చెయ్యండి.

గురు॥ చేస్తా విను యీ కలలో వక్కమనిషివచ్చె. వచ్చి కొంతసేపు వుండె. వెంటనే చూస్తువుండగానే యేమీలేదు. యిది నీకు దృఢమా అనుమానమా.

శిష్యు॥ దృఢమేకాని కలలో వచ్చినవి అయోనిసంభవులు. ఇవుడు యోనిసంభవులు యేలాగుఅయ.

గు॥ కలలోనే స్త్రీపురుషసంయోగము లేదా, పెద్దవారుకారా, వడుగులుకావా, వివాహములుకావా, మళ్ళా కొడుకులు బిడ్డలు పుట్టరా, సంసారతనం చెయ్యరా, బిచ్చం యెత్తరా.

శిష్యు॥ దానికిమూలం యేమీలేదు.

గురు॥ దీనికి మూలంయేమీలేదు. నీకు యేమైనాయెక్కువతక్కువ యోచనాచెప్పు భ్రాంతి మేలుకున్నదాక తప్పదు. వున్నంతసేపు యీ కల నిజధినలె వుంచుండి. వెంటనే గుఱ్ఱెరుగుచుండగానే యేమీలేదు.

అది వున్నపుడు అలాగే గర్భిణీఅయింది నీవే గుర్తెరుగుదువు. కోనకు చస్తే యేమీలేదని నీవే గుర్తెరుగుదువు కలకు దీనికి యెక్కువతక్కువ యేమి.

శిష్యు॥ యేమీ యెక్కువతక్కువలేదు.

గురు॥ సరేకదా నీకు వొక్క భ్రాంతివున్నది. అది పోకడ పెట్టు కుంటివే నీకంటె అధికులులేరు.

శిష్యు॥ అది యెటువంటిది సూచనచెయ్యండి.

గురు॥ చేస్తాగాని యెక్కువ ప్రసంగాలు చెయ్యవుగదా.

శిష్యు॥ యింత నీకు భయంయేమి ? ప్రసంగం పుట్టకుండా సూచన చెయ్యండి.

గురు॥ నేను సూచన చెయ్యంగానే యేమీ సీవుకనుక్కోవాలె.

శిష్యు॥ వున్నట్టు చెప్పితే యెటువంటి మొద్దుకూడ వినంగానే తనకు తానే తోస్తుంది.

గురు॥ నీమాట సరేకానీ యీకలలో వచ్చిన శరీరాలు మనకు యిప్పుడు కానుపించే శరీరాలు సమానమా యెక్కువతక్కువా.

శిష్యు॥ యేమీ యెక్కువతక్కువలేదు యిది నకసూటిదే.

గురు॥ యిది అందరికి యెరుకేకదా.

శిష్యు॥ యెరుకే.

గురు॥ అట్లైతే నీవు యేమి.

శిష్యు॥ నేనా నేను యీ మూలంలేని గుర్తెరిగే శరీరం.

గురు॥ కలలో వచ్చిన శరీరాలకు మూలం యేమీలేదు.

శిష్యు॥ యెవ్వరిసత్తాచేత వున్నది.

గురు॥ కలలో వచ్చిన శరీరాలు యెవ్వరి సత్తాచేతవున్నవి. వాటి కవ్వే పీటి సత్తా యెవ్వరికిలేదు వాటివలె వీటికి యెవ్వరిసత్తాలేదు. వీటికి యివ్వే యీ శరీరాలు యెవ్వరు రమ్మనేవారులేరు పొమ్మనేవారులేరు వుండుమనేవారులేరు విచారించని మహాత్ములు వీటికి మూలం సృష్టిదని భ్రాంతిచేత వున్నారు. విచారిస్తే అందరికి మూలంలేదని యెరుకే.

శిష్యు॥ అట్లయితే కలలో వచ్చిన శరీరంవంటిదే యీ కానుపించు

శరీరం. కానుపించే శరీరంవంటిదే కలలో వొచ్చిన శరీరం.

గురు॥ యేలాగైనా నాకక్కడే కలలో వచ్చిన శరీరంవంటిది అయినా యేమిా లేదు. మనకు కానుపించె శరీరాలవంటిది అయినా యేమిా లేదు.

శిష్యు॥ అట్లయితే నీకు శరీరం వున్నట్టా లేనట్టా.

గురు॥ నాకా. కలలోవచ్చిన శరీరం మేలుకుంటే వున్నట్టా లేనట్టా.

శిష్యు॥ మేలుకుంటే యేమిా లేదు.

గురు॥ కొంచమైనలేదు యేమిాలేదు యీా శరీరం యేమిలేదు.

శిష్యు॥ యిపుడు చస్తేనా.

గురు॥ ఛీ యెపుడు విచారిస్తే అపుడు గురుకటాక్షించాత యేమి లేదు. నిబద్దేనా?

శిష్యు॥ నిబద్ధే.

గురు॥ యిందుకు అనుమానమేమి.

శిష్యు॥ కొందరూ చస్తే యేమిలేదంటారు అలాగయితే గురుస్వామి నుకు విచారణకు ఫలమేమి చచ్చిన తరువాత భ్రాంతిరహితమెవరికి.

గురు॥ ఛీ అదిమాటకాదు. చచ్చేది యేమి మొదలు యేమిా లేదు యేమిా లేదు.

శిష్యు॥ యీాలాగు అందరికి సమానమే.

గురు॥ గురుమూలంగా విచారించినవారికి యెపుడు విచారిస్తే అప్పుడు మూలంలేని యీా గుర్తెరిగే శరీరరం యేమిా లేదు.

శిష్యు॥ యీాలాగు సరేనరే. యిందుకు అనుమానం లేదుగాని గురుస్వామిా నాకు రెండబద్ధాలు తోస్తావి.

గురు॥ యేమవి.

శిష్యు॥ సుషుప్తి అనేమాట మరణం అనేమాట అది యేలాగు?

గురు॥ మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమిాలేకుంటే యేమో.

శిష్యు॥ సరే అది జాడే.

గురు॥ సుషుప్తిమరణము అని మంది కల్పించినారు. యింతేకాని

వున్నది వక్కటే. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు కలలో గురుమూలంగా కలలో వచ్చిన శరీరాలు మెరుకతోటి వుండగానే యేమీ లేదు అని తనకుతాను యేలాగు దృఢమో అలాగే గురుమూలంగా మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమిలేదుఅని తాత్పర్యమాయెనా అదే మేలుకొనుట యింతేకాని వక్కటయినా అవస్థలేదు. స్వప్నావస్థ గురువు మేలుకొలిపితే అదే జాగ్రత. ఇంతేకాని నాలుగు అవస్థలు లేవు. యీ శరీరం వక్కటే నాలుగు శరీరాలు అనుట అబద్ధం. మూలంలేని యీ గుర్తెరిగే శరీరము స్వప్నావస్థ గురుకటాక్షంచేత మేలుకుంటే అప్పుడే జాగ్రత యింతేకాని యెక్కువ ముచ్చట్లు యేమీలేవు.

శిష్యు॥ స్వామీ నాకు చాలు మీరు కష్టపడితిరి శిష్యుడు మొద్దు యేమో అని మహా భయపడితిరి. యిటువంటి ముచ్చట యెవ్వరికి దృఢం కాకపొయ్యేని అని మీరు భయంవిడవండి యెంత మొద్దులయిన అనాయాసంగా తనకుతానే దృఢం అవుచుంది.

గురు॥ ఏమయినా ఆయాసముప్పదే.

శిష్యు॥ అతిసులభం యిటువంటి సులభం యెన్నడు వున్నదని విన లేదు. మహాకఠినం వున్నదని విన్నా. అనేక సాధనలువిన్నా. కొన్ని నేను చేసినా. యిప్పుడు విచారించుకుంటే గట్టురు మోసిన కష్టెలవలెనుంటే నక్క సాధన అక్కరకు రాకపాయ. సముద్రం కాళ్లచేత నడిచిపోయినట్లాయెను.

గురు॥ శాభాసు.

శిష్యు॥ గురువు అంటే యీలాగు వుండవద్దా.

గురు॥ శాభాసు.

శిష్యు॥ అయ్యా సత్యం యెవ్వరూ నమ్మరు. అబద్ధాలు సుహా నిబద్ధి అనిపిస్తుంది. వారు యెంతోవారు అనిపిస్తుంది. వున్నది వున్నట్టే సాధనలేకుండ అనాయాసంగా చెప్పి సూచన చేసినవారికి ఏమైన యిత్తా మంటే ఛో వారికి యేమీగావలె. మనకు ఏమిగావలె. మనకు యేమి వున్నది ఎక్కడికక్కడనే అనిపిస్తుంది. యెన్నడైన స్వయంపాకమైన

అందుకు అందరికి శరీరమనే బ్రహ్మరాక్షసి పట్టి.

విభూతి కొందరికి పూస్తుంది.

తిరుమణి కొందరికి పూస్తుంది.

కొందరికి భాగవతమనే గొడ్డలి పెడుతుంది.

కొందరికి చిప్పలునిండా ముద్దర్లు పెడుతుంది.

కొందరికి యేమిలేకా వృత్త నామట వుంచుతుంది.

కొందరికి కుంకుమ.

కొందరిని బోడవాండ్లు.

కొందరిని బ్రహ్మచార్లు.

కొందరిని సన్యాసుల చేసి.

కొందరిని ఉహితాజ్ఞులచేసి.

కొందరిని వుపాసకుల.

కొందరిని లింగధారులచేసి అందరిని మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే పరబ్రహ్మ యిన్ని తిప్పలు పెడుచుంది.

గుర్తెరిగే చైతన్యమునకు వక్కటైన వికారంలేదని అనుకుంటూ యిన్ని గుర్తెరిగే చేష్టలు చేసుకుంటూ యిదే బ్రహ్మమనే రాక్షసిని విడిపించేవాడు యెవడైనా వున్నాడో లేడో.

దేహమనే చెట్టుకు శంకరాచార్యులు అనే సన్యాసి గుర్తెరిగే జ్ఞానమనే చైతన్యాన్ని కట్టివేసినాడు.

వేశినమాత్రమేగాని వుంటే వుంచుంది. లేకుంటే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు.

కలలో వచ్చిన శరీరము మేలుకుంటే యేలాగు యేమీలేదో అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు.

నామరూపమేలేనిది తనకుతానే స్వతస్సిద్ధమై చలించక సార్వకాలం వక్కతీరుగా వున్నది.

స్వాములవారి అద్వైతం స్వాములవారితోటే పోయినది.

ద్వైతా ద్వైతరహిత పరమతత్వమే వున్నది.

యిదే మహా అద్వైతం.

దశముఖుడు వేరే శతముఖుడు వేరే అన్నట్టు యెక్కడనంటే అక్కడ బట్టబయలే వున్నది.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమీలేకుంటే యేలాగు వున్నదో ఆలాగే వున్నది.

కాకపోతినని చింతవుండెనా శరీరం వుండనే వున్నది.

కావలెనని యిచ్ఛ వుండెనా శరీరం వుండనే వున్నది.

అయితినని నిశ్చయం వుండెనా మరి ఘట్టిగా వున్నది.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరం యేమి లేకపొయ్యేని స్వభావము.

యిషువంటి చంచలమైన శరీరాన్ని సత్యమని నమ్మి మూలంలేని యీ గుత్తేరిగే శరీరమే నేను అని బ్రహ్మానుభవముచేత సకల అనుభవాలు చేస్తు అనుభవ వేదాంతమని ప్రసిద్ధి చెప్పుకుంటూ అచలం యొక్క జాడ యెరుగక అచలముందే వుండి అచలంలోనే సంచారము చేసుకుంటూ అచలం మాకు యెన్నటికైన జాడ దొరికేనా అని అనుకుంటూ సుఖ దుఃఖము సర్వకాలం అనుభవింపుకునుచూ వేదాంత కాలక్షేపముచేత అనేకమంది క్లేశపడుచూ వున్నారు.

శరీర లేని గురు సాంప్రదాయం కనుక్కొని సుఖదుఃఖ రహితము కావలెనని యెవరికి యిచ్ఛలేదు.

శీఘ్రంగా యేలాగు భ్రాంతిలేకపొయ్యేనని ప్రయత్నం చాయక సాధనలచేత క్లేశపడుచూ వున్నారు.

అత్యంత గురుసేవచేత అత్యంత గురుసాంప్రదాయం గలవారిని చూచి విద్వాంసులయొక్క శిష్య సాంప్రదాయం చూచి యే సిద్ధాంతం చెప్పిన తగులక మహాద్వైత సాంప్రదాయం భేదాభేదరహితమైన గురు సాంప్రదాయం చూచి వారి సహవాసం దీర్ఘకాలంచేసి కనుక్కొనిన భ్రాంతి లేనివాడు అయి సర్వకాలం యేకప్రకారంగా యేలాగు వున్నాడో ఆలాగే వుంటాడు.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరముచాత సాధిద్దామంటే యిషు వంటివి అనేకకోట్ల శరీరాలు సాధనలు చేసినా పరిపూర్ణం దొరక

కొందరు కొన్నాళ్లు నేను సత్క్షేత్రానికే జ్ఞానమనే బ్రహ్మను చేసుకొని సకల సంకల్పములు సకల భ్రాంతులు వదలక భంగపడి పోయినారు.

యిటువంటి దగాపనులు మా మార్గంలో లేవు.

మేము లెస్స సమాధానంగా చూచి విచారించి యిప్పుడు వావదిది యీ బట్టబయలు అని మేము అన్నాము.

యీ బట్టబయలుకే మొదలు కొన లేదు అన్నాము.

యీ బట్టబయలే అచలమని అన్నాము.

యీ బట్టబయలుకు యెరుక లేదు గనుక కర్మలు పుట్టనే పుట్టవు అన్నాము యీ బట్టబయలుకు శరీరం లేదుగనుక సర్వకాలం భోగించె య్యాదు అన్నాము.

యీ బట్టబయలుకు శరీరం లేదుగనుక [illegible] వ్యమయింది అన్నాము.

యీ బట్టబయలు తనకుతానే స్వతస్సిద్ధము సర్వకాలం వక్కతీరుగా సకలదేశాలయందు వున్నది అన్నాము.

యీ బట్టబయలే సార్వకాలాలయందు వక్క [illegible] యినా వికారంలేక వున్నది అన్నాము.

సార్వకాలాలు అంటే శరీరాలు రాకముందు [illegible] బట్టబయలే వున్నది.

మూలంలేని యీ సుక్షేత్రానికే శరీరము వుం[illegible] వున్నది.

మూలంలేని యీ సుక్షేత్రానికే శరీరం నశించిపోయినా యీ బట్టబయలు వక్కతీరుగా చలించక సార్వకాలం వక్కతీరుగా వున్నది.

యీ బట్టబయలు గాక మరివకటి వున్నది [illegible] బట్టబయలు యెరుగదు.

యీ బట్టబయలును జ్ఞానచక్షువుచేత వుండి చూచినవాడు భ్రాంతి రహితుడు అవుతాడు.

శిష్యా॥ యీ బట్టబయలుకు బదులు వారి [illegible] బట్టబయలు లేదు. అని అందరికీ [illegible] కద్దు నానకకూడ కద్దు. [illegible]పోయినా

యెఱతెగిక అంతట దట్టంగా యెక్కువ శక్కువ లేక మనము ఏకమునుకి ముందర ముందర స్వతస్సిద్ధమైయున్నది. యిప్పుడింకా బట్టబయలు వున్నదో లేదో అని యెంచువంటి మనిషికి సంశయంలేదు.

గురు॥ యీ శరీరాలు బట్టబయలు వలన పుట్టవుగదా. కలినా మదలినా వ్యవహారమే లేదు. యెందువంటి గడ్డితినే వాడూ అయినా యీ బట్టబయలు వలన పుట్టినదనడు.

శిష్యు॥ అనముగాని యీ శరీరాలు అనేక ప్రకారాలుగా వున్నవి. యేలాగు నిర్మాణాలు ఆయె వక శరీరంవలె వక శరీరంలేదు.

యెద్దు వకతీరుగా వున్నది.
యెనుబోతు వకతీరుగా వున్నది.
గుర్రము వొకతీరుగా వున్నది.
గాడిద వొకతీరుగా ఉన్నది.
యేనుగ వొకతీరుగా యున్నది.
లొట్టపిట్ట వొకతీరుగా వున్నది.
కుక్క వొకతీరుగా వున్నది.
పిల్లి వొకతీరుగా వున్నది.
యెలుక వొకతీరుగా వున్నది.
పంది వొకతీరుగా వున్నది.
పాము వొకతీరుగా వున్నది.
తేలు వొకతీరుగా వున్నది.
కాకి వొకతీరుగా వున్నది.
గెద్ద వొకతీరుగా వున్నది.

పక్షులు వొకతీరుగా వున్నవి. యీ ప్రకారాన అనేక విధాలు వ్రాయ శక్యంకాదు. యిన్ని విధాలు యెవ్వరు చేసిరి, యెవ్వరినుంచి ఆయ యెవ్వరి సత్తాచేత వుండె కొరకు యెవ్వరి వలన లయం ఆయె. యీ ముచ్చట మాకు సమాధానం అయ్యేటట్టు అందరు సరెనని అని సంతోష పడేటట్టు వెంటనే భ్రాంతిలేక పొయ్యేటట్టు అనేక సాధనలు లేక వకసారి వినంగానే తనకు తానే స్వతస్సిద్ధం అయ్యేటట్టు మళ్ళీ సంశయం పుట్టే

టంగుకు మూలం యేమీలేకుండా సకల భ్రాంతులు తోచకుండా శీఘ్రంగా మాకు సమాధానం అయ్యేట్లు దయచేసి చెప్పండి. చెప్పం చుండగానే మాకు సమాధానం కావలె మహాత్వరలో శ్రవణం చెయ్యాలి అని.

గురు॥ నీకు మహాతీవ్రం.

శిష్యు॥ తీవ్రంఅంటే మీరే అనేకమాట్లు యిదేకలా యిదేకలా అని చెప్పుతిరి. గనుక దీన్ని నమ్మరాదు అని తప్పున మీరే మేలుకుంటారో నేనే తప్పున మేలుకుందునో మీ వంటివార్ని యెన్నటికి చూచేము. అను కుంటూ వుంటిమి. తప్పున మాకు మీరే వస్తిరి. గనుక వేగిరం చేసు కుందామని యిచ్ఛ వున్నది.

గురు॥ సరేకాని నేను మేలుకుంటే నేను యేమిలేదు. నీకు యేమి.

శిష్యు॥ నాకు వినిపించేవారు యేరి.

గురు॥ సరే అందుకా అట్లైతే విను. నీవు చెప్పు.

శిష్యు॥ నేనా మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును నేను.

గురు॥ సరే యీ బట్టబయలుకు వక్కటైన యెరుక వున్నాదీ.

శిష్యు॥ దానికి యేమియెరుక. దానికి యెరుక లేదు.

గురు॥ యిన్ని శరీరాలు రాకముందే అది వున్నది యీ శరీరాలు వచ్చింది యెరుగదు పోయింది యెరుగదు యిది అహాంతర మౌరతనం. యీ బట్టబయలువలె శాశ్వతమయినది కాదు. దీనికి వక మూలం వున్నదిగాదు. యీ శరీరం చూచి నప్పటినుంచి అన్ని కండ్లపడుచున్నవి. యీ శరీరం యెప్పుడు యేమీలేదు. అని తనకుతానే యేదితోచదు. యీ శరీరం తనకు తానే లేకపోవలె,

శిష్యు॥ కొనకు చస్తె యేమీలేదు.

గురు॥ ఛీ అలాగు కాదు. చావు లేనేలేదు. యీ శరీరానకు మూలం యేమీలేదు. కొనకు చావు యెక్కడిది. చావుఅనే మాట మాత్రమే.

శిష్యు॥ సుషుప్తి అన్నట్లా.

గురు॥ ఛీ ఛీ ఆమాటలు వినవు. యీ శరీరం యేమిలేదు. లేకుంటె మంది సుషుప్తి అన్నారు. మళ్లా యేమిలేకపోతే మంది మరణం అని అన్నారు. యింతేకాని విచారిస్తె యీశరీరమొక్క రాకడకు మూలం లేదు. వుంకీ మూలంలేదు. పోకడకు మూలం యేమీలేదు. యీశరీరము స్వభావం వున్నట్టే వుండేది వెంటనేయేమీలేదు. మరి యిపుడు యెన్ని విధాల శరీరాలు చూస్తావో అపుడు కలలో యిన్నివిధాల శరీరాలు చూస్తావుగదా.

శిష్యు॥ ఆహా చూడనేమాత్ర మెన్న గుర్తెరుగుతా ఆశరీరాలు నేను కొంతసేపు వుచ్చుటాడుతాను యింకా వింత వింత అనేక శరీరాలు అనేక చిత్ర విచిత్రాలు వెన్నఅవి మమ్మల గుర్తెరుగును మేము వాటిని గుర్తెరుగుదుము మాకు వాటికి కొంచమైన యెక్కువతక్కువలేదు. రెండు సమానమే గుర్తెరుగుచూ వుండగానే ఆశరీరాలు గుర్తెరిగే చైతన్యముతో కూడా యేమీలేదు ఆశరీరాలు యీశరీరం రాకమునుపే గుర్తెరిగే చైతన్యమనే జ్ఞానము అనేక చిత్ర విచిత్రమైన కర్మాలతో యీ శరీరం యేమీలేదు కర్మాలు లేని యీబట్టబయలు యెప్పటివలెనే వున్నది.

గురు॥ యేలాగు వున్నది.

శిష్యు॥ ఆలాగే వున్నది. యీశరీరం ఆశరీరాలు యెన్నితిప్పలుపడ్డా యేమీఅనదు చూడబోతే యీబట్టబయలులోనే ప్రపంచం వున్నట్టు వున్నది.

గురు॥ ప్రపంచానకు యీబట్టబయలుకు యేమీ సంభంధం లేదు.

శిష్యు॥ యీబట్టబయలు తాను చెయ్యాచెయ్యదు చేయించా చేయించదు తానేతాను అయివున్నది.

గురు॥ సరేకదా.

శిష్యు॥ సరే.

గు॥ యిపుడు నీకునక్క దృష్టాంతం చెప్పుతాను విను యీకలలో శరీరం వస్తేనే భ్రాంతివచ్చె ఆశరీరాలు యీశరీరంతంటె చేసేనా.

శిష్యు॥ యీశరీరమే అనేకశరీరాలు అయినది.

గురు॥ అయినవే మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు నానావిధ

శరీరాలు యీశరీరంవకటే వేరేతోచినవి యీశరీరంకొంటే వేరేవేరేకాన్లు, యీశరీరం అనేక చిత్రవిచిత్రాలుకాలేదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు చిత్రవిచిత్రిప్పు శరీరాలుతో స్థావి యింతేకాని వచ్చేటందుకు మూలం యేమీలేదు.

శిష్యు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి కల్పించే సామర్ధ్యంలేదు.

యీలాగు అవాంతర పిశాచంవలె నున్నది.

తల్లిగారి పిశాచంకాదు.

తండ్రిగారి సంభంధంవలనవచ్చిన పిశాచంకాదు.

చుట్టాలదీకాదు.

అత్తగారి సంభంధందికాదు.

కాశికిపోంగా తోవలో అడ్డంతగిలిన బ్రహ్మఅనె రాక్షసివలె బ్రహ్మరాక్షసికాదు.

మధ్య యీకలలోనే సన్యాసివచ్చి బ్రహ్మరాక్షసి పేరుపెట్టి మందికి తగులుపెట్టి పోయినాడు.

వున్న బట్టబయలుకు గుర్తెరిగే జ్ఞానమేలేదు. గనుక గుణకర్మాలు లేక పేరూ వూరూలేక తనకుతానే స్వతసిద్ధమై చలించక సాక్షీకాలా నక్కతీరుగా వున్నది.

యీబట్టబయలుకు శరీరంలేదు గనుక వాక్కూ మనస్సూ తోచదు.

సకలభ్రమలకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం.

యీశరీరం లేనివారికి యేమితోస్తుంది అంటే

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేని యీ బట్టబయలుకు యెలాగుతోచదో ఆలాగే దృష్టాంతం యెలాగో ఆలాగే దార్ష్టాంతికము సూచనకాగానే పుట్టనిచావని బట్టబయలే వుంచుంది అని అన్నారు.

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేనివారి సహవాసం చేసిచూడవలెను.

శిష్యు॥ చూస్తె యెలాగుతోస్తుంది.

గురు॥ [illegible]

శిష్యు॥ విచారిస్తె.

గురు॥ దార్ష్టాంతం సూచనచేస్తారు.

శిష్యు॥ చేస్తే.

గురు॥ తాత్పర్యం చేసుకోవలె.

శిష్యు॥ చేసుకుంటే.

గురు॥ మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం వున్నంతసేపు తోస్తుంది. తోస్తువున్నా కొలది భ్రాంతి విడువదు.

శిష్యు॥ భ్రాంతి విడువకపోతే విచారానకు ఫలమువ్యేమి.

గురు॥ వున్న యీ బట్టబయలు తాను పుట్టదు పుట్టించదు. యీ బట్టబయలుగాక మరిహోటి శాశ్వతమయినది వకటైన వికారంలేనిది మరిహోటిలేదు. యీ శరీరం మధ్యనే తోస్తుంది. మధ్యనే యేమీలేదు. మూలంలేని యీ గుత్తేదారిగే శరీరానకు సర్వం తోస్తుంది. యీ శరీరం యెప్పుడు యేమీలేకపోతుందో అప్పుడే యేమీతోచదు. యీశరీరాన్ని కలలో వచ్చిన యేనుగు మేలుకుంటే యేలాగు యెమీలేదో అలాగే యీ శరీరాన్ని చూడవలె ఆలాగు తాత్పర్యం అత్యంత శూన్యంగా విచారించవలె. విచారించక కలలోవచ్చిన యేనుగును పున్యానకు అమ్ముకుంటె పదివేల రూపాయిలు వస్తవని ఆశపడినా మేలుకుంటె యేమీలేదు. మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం చేత యేమి సాధనచేసినా కలలో యేనగను ఆశపడితె అమ్ముకునేటందుకు యెంత ఆశపడెనో ఆ ఆశవలెనే మేలుకుంటె యేమీలేదు. తనకుతానే దురాశ అని యెరుగు. ఆ దురాశ వంటిదే మూలంలేని యీ గుత్తేదారిగే శరీరంచేత సాధిస్తె. పుట్టడం చావని బట్టబయలు అని ఆశ వ్యారికే కలలో వచ్చినట్టు తోచింది. చానూలేదు వుండనూలేదు యేమీలేదు. మూలంలేని యీగుత్తేదారిగే శరీరానకు మూలం యేమీలేదు. గనుకా వున్నట్టు వున్నది. వున్నాగాని మూలం లేని యీగుత్తేదారిగే శరీరము యేమిలేదు. అని కలతోచినది కలలోనే యేమీలేదు అని కలలోతోచిన శరీరాలు వెంటనే యేమి చింతలేక సర్వ సూన్యమయిపాయెను గనుక అలాగే మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం కొంచమైనా యేమిలేకుంటె పరమ శాంతం తనకుతానే అవుతుంది.

సాధనలచేతగాదు, కల తోచినట్టు మూలంలేని యీగా గురుశ్రేణిగే శరీరం నేను అని తోచింది.

శిష్యు॥ తోచిన మాత్రమేగాని శరీరం అయినదేమ.

గురు॥ సర్వకాలం శరీరంలేని పరిపూర్ణ స్వభావమునేనే వున్నాను. యిల్లు పడిపోతే నాయిల్లు అని యీ శరీరం పోతుంది పోయి యెవ్వరైన వకవేళ నాకొడుకు అని యాదివస్తుంది. నాబిడ్డ అని యాదివస్తుంది. నా భార్య అని యాదివస్తుంది. సార్వకాలము వున్నని నానని పరిపూర్ణ స్వభావమే సర్వకాలం యీ మూలంలేని గురుశ్రేణిగే శరీరమే అయివుంటె సార్వకాలం యెరుకేవ్వడు సార్వకాలం కర్మలే చేస్తువుంటె మధ్య తగులుతుంది మధ్యనే యేమిలేదు. సార్వకాలం మొదలు కొనలేని ప్రబలమే.

శిష్యు॥ కాని మూలంలేని యీ గురుశ్రేణిగే శరీరం నేనేమో అనే భ్రాంతి ఆశపడితె తాను అనుకున్నట్టు గోచరి అయింది. తాను వకటి అనుకుంటె వున్నది మరొకటి రాజమార్గం వుండంగా అడవికిపోయె తోవవలె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేనేమో అనుకున్నా యిప్పుడు యెంత వారు అయినా తోవతప్పేదికేమ. యెవ్వరైన యిది బాటకాదు అని రాజమార్గంలో పడవేస్తె మళ్ళా చిల్లరతోవలు నమ్మినట్టు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదని చెప్పితె పుట్టని చావనిది మొదలు కొనలేనిది రాకడ పోకడలేనిది తనకుతానే స్వతసిద్ధమై చలించక వున్నది. సర్వకాలం యేక పరికారంగా వున్నది. దానికి ప్రతిబంధం మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే మరిపాటిలేదు. తనకుతానే కలతోచినట్లు తనకు మూలంలేని యీ గుశ్రేణిగే శరీరం తోచింది యీ తెరతీసే గురు సాంప్రదాయం కోట్లలోపల వొక్కరు వున్నారోలేరో.

గురు॥ వారి సహవాసంచేసి చూచేదాక నమ్మరాద తెరఅయితె నాలికె యెగిరి పొయ్యేది,

శిష్యు॥ సరె సరె,

గురు॥ శరీరాన్ని గట్టిగా రాళ్ళగోడవలె నిలిపినవారు కొందరు గోడవలె నిల్పినవారు కొందరు. అందుకే శంకరాచార్యుల సంను

మాసందు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే బట్టతెరవలె వున్నది గనకా మేము పరమపదమనే వైకుంఠము పట్టతెగ కీలనట్టు మూల లేని యీ గుర్తెరిగే శరీరం లేని ఆచార్య కటాక్షంచేత నిరుహేతుక జాయమాన కటాక్షము గలిగినా యీ బట్టతెరతీస్తె అంతా వైకుంఠమే కొంచో ప్రమేయము లేదు.

వైకుంఠంగానే అనేక ప్రతిమలు వున్నవి.
వైకుంఠమును యెరుగవు.
బట్టతెర వున్నది.
తానుతీసుకోలేడు
తనకుతాను పోదు.
సామాన్యులు తీయలేరు.
బట్టతెరవలె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నది.
యీ తెరతీస్తె సకల దేశాలయందు యీశ్వరుడు వున్నడు.
యీశ్వరునకు కుంఠితంగాని వైకుంఠానకు వేరులేదు.
సకల దేశాలయందు వైకుంఠం వున్నది.
యెక్కడనూటె అక్కడనే విష్ణువున్నాడు.
యీ రహస్యం యెవ్వరికి తెలియవు.
విష్ణుమాయా అని ప్రసిద్ధికద్దు.
అరచేతిలో వైకుంఠం మున్నది.

ఆచార్య కటాక్షంగలిగి మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే తెర దీస్తె కుంఠితంగాని వైకుంఠం తనకుతానె స్వతసిద్ధమై చెలించక సార్వకాలం యేక ప్రకారంగ వున్నది.

యేసిద్ధాంతం నమ్మినా మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేని రాజమార్గం లేదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరంనునిల్పి యేమి చెప్పినా మును పక్కి గాడిద వాలకంపోదు.

యిందుకే మొట్టమొదలు బట్టబయలు వున్నదిగదా అని నిత్య సూరుమాళ్లు పదిదినాలు చెప్పవలె గట్టిగావున్నది అని పదకొండోనాడు

అనెనా వీడు ఘట్టివాడే అని వాడిని దగ్గరవుండు మనవలె వుండి శేవవంచన లేక చేశెనా భ్రాంతిలేని రాజమార్గం సూచనచాయవలె మొద్దు ఆయనా వెగిరం సూచన చాయకూడదు. చేస్తె వ్యర్ధం అవుచుంది వెయ్యిమాట్లికి వుపదేశం చెప్పి ఎండవలె శరీరంలో కొంచం నిబద్ధి అని చెప్పెనా గురువు పుత్ర మిత్ర కళత్రాదులతోటి నిర్మూలమయి వంశక్షయమయిపోతాడు అని భరద్వాజుడు పలికినాడు యేమి అని అంటె.

స॥ సమూలోవా ఏషపరిశుష్యతి । యోఽనృతమభివదతి

తస్మాన్నార్హామ్యనృతం వక్తుం॥

అని ప్రశ్నోపనిషత్తునందు వున్నది ఆందుకే ఛీ అని యెవ్వరికి అబద్ధాలు చెప్పకూడదు. అధికారి అయితే నిబద్ధి సూచనచేసేది. మూలం లేని యీ గుత్తేదారిగే శరీరానకు సార్వకాలం జగత్తుతోచే స్వభావం తనకుతానే కలతోచింది.

ఉందులో యెంతమంది సన్యాసులు తోచినారు యెంతమంది అనేక మయినవారు తోచినారు వారు గుత్తేదారుగే చైతన్య స్వరూపులా మరి హో స్వరూపులా.

శిష్యు॥ అందరు గుత్తేదారిగేవారే.

గురు॥ వారూ శరీరం సమానమా

శిష్యు॥ యెరుకతో వుండంగానే వారు యెక్కడికి పోయిరి, యెక్కడి నుంచి వచ్చినారుగనుక యెక్కడికి పోయిరి అని చెప్పుదు. తనకు తానే తోచింది వెంటనే యేమిలేదు.

గురు॥ తనకుతానే స్వతసిద్ధమయిన బట్టబయలులో తనకుతాను వచ్చిన శరీరం శరీరమే నేను అనుకొనుచున్నది మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం వుండంగా అనేక శరీరాలు తోస్తువున్నవి. కలలో వచ్చిన శరీరాలనవలెనె మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం యేమీలేదు అని మేలుకుంటె యెవ్వరికి తోస్తావి. యీ గుత్తేదారిగే శరీరం యేమీలేకుంటే యేమీతోచదు. కలలో వచ్చిన శరీరాలు మేలుకుంటే యేమీలేదు అని తనకుతానే ధృడంవున్నది.

శిష్యు॥ యేమీ సాధన చెయ్యకుండదే తనకుతానే మూలంలేని

యీ గుత్తెరిగే శరీరం యేమీలేదు అని సరిపుచ్చుకోవలె.

గురు॥ యేమీ యెన్నడయినా కల తోచిన దేహాలు యేలాగు యేమీలేదో అలాగే మూలంలేని యీ గుత్తెరిగే శరీరం యేమీలేదు అని సరిపుచ్చుకున్నావు.

శిష్య॥ సరిపుచ్చుకోలేను.

గురు॥ యిప్పుడున్నా

శిష్య॥ యీ గుత్తెరిగే శరీరం కల తోచిన శరీరం మేలుకుంటే యేలాగు యేమీలేదో అలాగే యేమీలేదుఅని అనుకున్నా. నాకు స్మరకంవచ్చు. యెవ్వరు అనుకోరయ్యా వ్వారికే కలవంటిది యీ సంసారం అని అనుకుంటారు.

గురు॥ అప్పటిది అప్పుడేపాయ. యీ సరిపుచ్చుకుంటే వృష్ణ దానికి శరీరం యేమీలేదుగనుక దానికి తోచనేతోచదు. అందుకే మూలంలేని యీ గుత్తెరిగే శరీరంకు తోచిన శరీరాలు వెంటనే ఏమీ లేదు అని దృఢం వున్నట్టు వుంటే చాలు. యిందుకు యేమైన సాధన చెయ్యవలే.

శిష్య॥ యే సాధనచేస్తే కల దోచిన శరీరాలు యేమీలేదు అని దృఢం అయింది యేమీలేదు. తనకుతానే దృఢం వున్నది. యిక్కడ దృఢంతోకూడా ఏమీలేదు అనుకుంటూ వున్నా వున్నంతసేపు వున్నట్టు వున్నవి వెంటనే యేమీలేదు.

గురు॥ అలాగే గురుమూలంగా యెప్పుడు మేలుకుంటే అప్పుడే కొంచెమైన శరీరం లేక కల తోచిన దేహాలవలె వెంటనే యీ గుత్తెరిగే శరీరం యేమిలేదు. యీపాటు ఆశపడ్డా అంతా వుంచుంది. యిది రాజ మార్గం.

ఇతి శ్రీశివరామదీక్షిత పరిభాషే వేదాంతవిచారణే
క్షేత్రక్షేత్ర ద్వంద్వ దోషరహిత ప్రకరణము
ఏకాదశోధ్యాయః

---

శ్రీగురుభ్యోనమః

# ౧౨॥ ఆత్మానాత్మ ద్వయదోషహారత ప్రకరణము.

---

శ్లో॥ ఆకాశం నైవమాకాశం । సర్వమస్తినాస్తిచ
ఇతిస్థితంసమంశాంతం । యస్తస్మోనంయుష్మ స్థితః॥

గురు॥ మూలంలేని యీ గుహ్యాకారిగే శరీరం యేమిలేదు అనే సిద్ధాంతమే సమానస్థితం.

కల దోచిన దేహాలు యీ దేహాలు చుట్టాలు వీరికి వారికి మహాస్నేహం నిత్యా మీరు లెస్స వున్నారుగదా అని అన్యోన్య యేకాంతాలు కద్దు. మీకు యేమి విపత్తులేదుగదా అని కల దోచినవారు అడిగితే మీకు మీరే దిక్కు మాకు మేమే దిక్కులని వీరు వారు సమాధానం చేసుకుంటారు.

కల॥ సరేకాని మనము చేసిన పుస్తకాలు చూస్తారుగదా.

జా॥ చూస్తారుగాని మనలోనే పోటీలు వున్నవి.

కల॥ అదేమి.

జా॥ వీరువారు సమానమే అని గులగుల పుట్టింది.

కల॥ యిక యేలాగుఅన్నా.

జా॥ మనకు మూలం యేమీలేదు. కాసకు ప్రవేసిం చేటందుకు స్థానం యేమీలేదు అని పుట్టింది.

కల॥ అంతా యీ కల తోచిన దేహాలు కెంటనే యేమిలేదు గదా.

జా॥ అలాగే మూలంలేని యీ గుహ్యాకారిగే శరీరం యేమీలేదు. అం కొందరు కనుక్కొంచువున్నారు.

కల॥ యేమీ యేమీ అంటేతే ముణిగే చెప్పవచ్చినట్టే వుండెను. యీలాగు వున్నది నాకు సంతోషంలేదు. యింతమట్టుకు చెప్పేరు చెప్పిరి. మనలో స్వామి దోషాలువున్నా అంటే దేవబ్రహ్మాంతి అయినా లేదు

జా॥ మీరు యేమిలేకుంటే మీకు యేమి భ్రాంతి వున్నది.

ఆలాగే మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమిలేదు అని సరి పుచ్చుకుంటే భ్రాంతికి మూలం యేమివున్నది.

కల॥ అట్లైతే మనపనికూడా కూకుడువేళ్లకు వూడిపోయె. యిప్ప టిది ఆలాగే వున్నది.

జా॥ యెంతఅయినా యీ శరీరంలో గ్రహించేనా కదలక మన మంతా వుందుము. యీ దరువాజ తగులబెట్టితే యేకబాట అయె.

కల॥ యిది యెవ్వరి తరం.

జా॥ మొదలు కొనలేని యీ బట్టబయలు వెయ్యిమార్లు వుప దేశించి చెప్పేది. కల దోచిన శరీరాలు వెంటనే యేలాగు యేమిలేదో ఆలాగే మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమిలేదు అని తాత్పర్య మయితే యిప్పటి పరిపూర్ణం తనకుతానే స్వతస్సిద్ధమై వున్నది.

కల॥ మనకు చోటుయేది మొదల శిక్ష్యంకాకుండా అయె. మూకు చాడీలు చెప్పినట్లు రానూ వెంటనే యేమిలేదు. మమ్ములను చూచే వాండ్లు మీ జాడ కనుక్కునిరి, మీరు జాగ్రతచాత వుండరారు. ... యేమిదిక్కు మాకు యేమి దిక్కు వెనక యేమిలేదు ముందర యేమిలేదు మగడులేని ముత్తైదువతనం యంతకని ఆపత్తరం. కాని యేలాగైతే ఆలాగు మనస్వభావమెలేదు. మనము దేనియందువున్నావెలా ప్రాప్తి లేక పోదుగదా.

జా॥ అందరికి అదే ఆశ.

గురు॥ యేమిలేనిది యేమిలేదు వున్నదిరాదు పోదుగదా.

శిష్యు॥ సార్వకాలం వక్కతీరే దీన్ని యెంతనమ్మినా క్షేమములేదు, శీఘ్రంగా యీ బట్టబయలు వున్నదనినమ్మి మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమిలేదు అని తాత్పర్యంచేసుకో వలెను.

గురు॥ యీ గుత్తేరిగే శరీరంచేత లేదు లేదు అంటె యీ శరీ రము వుంచుంది కలదోచిన శరీరం కొంతవున్నదా.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ ఆ శరీరాలు యేమయిన అనుకునుచున్నవా.

శిష్యు॥ యేమిలేదు యేమి అనుకుంచావ్.

గురు॥ ఆలాగు మూలంలేని యీ గుర్తెరికే శరీరాన్ని తాత్పర్యం చేసుకుంటే పరిపూర్ణం చెలించక తనకుతానే స్వతస్సిద్ధమై వున్నది. విచారించాతనేకాని సాధనచాతికాదు. అట్లైతే శ్రమమాత్రమే.

శిష్యు॥ అట్లైతే యెందుకు శ్రమపడవలె. పుట్టనిచావని బట్టబయలు తనకుతానే స్వతస్సిద్ధమై చలించకవున్నదిగదా.

గురు॥ యీ బట్టబయలు శాశ్వతంగా వుండనేవున్నది. యిఘు యేమిఅంటే మూలంలేని యీ గుర్తెరికే శరీరం ఆగంతుకం. కల తోచినట్టు దేహం తోస్తుంది. యిందుకు యుక్తి.

కల తోచిన దేహాలు వెంటనే యేమిలేదు అని తనకు యేలాగు దృఢమో ఆలాగే మూలంలేని యీ గుర్తెరికే శరీరం యేమిలేదు అని తాత్పర్యం అయితే సరి.

యీ రెండు దేహాలు ఆగంతుకాలే
కల తోచిన దేహాలు యీ దేహాలు వకటే.
రెంటికి మూలం యేమిలేదు అని తాత్పర్యం అయితే సరి.
మధ్యవచ్చి మధ్యపొయ్యే వాటికి మధ్యనే తోచింది.
మధ్యనే యేమిలేదు.
మూలంలేని యీ గుర్తెరికే శరరం లేకుంటే యేమితోచదు.
సకల భ్రాంతులకు మూలం మూలంలేని యీ గుర్తెరికే శరీరమే.
శరీరంలో కొంత సత్యమని ఆసక్తా అంతయెప్పటివలెనే వుమంది.
శరీరం పుట్టకమునుపే మొదలుకొనలేని యీ బట్టబయలు తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది.
వుండి తాను పుట్టడు.
రెండోదాన్ని పుట్టించనే పుట్టించదు
సార్వకాలం చెయ్యక చేయించక తనకుతానే జ్ఞానకర్మ సాధనద్వయంయొక్క అపేక్షలేక జ్ఞానంచేత కర్మలచాత సాధ్యంకాక వకటే తీరుగా వున్నది.

సాధనసాధ్య పరామర్శరహితమై తనకు తానే స్వతసిద్ధమై వున్నది.

మూలంలేని యీ గుహ్యేరికే శరీరం యేమిలేదు అని తనకుతానే విచారించాత కలలోవచ్చిన శరీరాలు వెంటనే తెనకుతానే యేమిలేదు, అని దృఢం ఆయినట్టు మూలంలేని యీ గుహ్యేరికే శరీరం అలాగుకొంచమైన యేమిలేదు. అని తాత్పర్యం లెస్సఆయితే యెప్పటిబట్టబయలే స్వతసిద్ధమై వున్నది.

ఆత్మే అనాత్మఅనే అడవిలో వుండెనా నరిఅడవితప్పదు.

సకలభ్రాంతులకు మూలం.

మూలంలేని యీ గుహ్యేరికే శరీరమే గనుక యిదిద్వైతా ద్వైతరహితపరమ తత్వం.

ఇతి శ్రీశివరామ దీక్షితప్రభావవేదాంత విచారణే
ఆత్మానాత్మ ద్వయదోషరహిత ప్రకరణము.
ద్వా ద శో ధ్యా యః.

---

శ్రీగురుభ్యోనమః

## ౧౩॥ ఆత్మబ్రహ్మౌపాధిద్వయదోషరహిత ప్రకరణము.

శ్లో॥ దృశ్యదర్శనయోర్లీనం । క్షణక్షణవినాశనోః ।
కేవలేదప్తపరీక్షిణం । రూపనామామచేతనం॥

గురు॥ మూలంలేని యీ గుహ్యేరికే శరీరం యేమిలేదు అనేసిద్ధాంతము రాద్ధాంతము రాద్ధాంతమె సిద్ధాంతము.

మూలంలేని యీ గుహ్యేరికే శరీరం యేమిలేదు అని కలలో వచ్చిన శరీరాలవలెనె యేమిలేదని సాధనలు చెయ్యకుండె తనకుతానే భ్రాంతిరహితం అయినా పుట్టని చావనిది రాకడపోకడలేనిది జ్ఞానకర్మ శూన్యమైంది, బంధమోక్ష సామ్యమయింది భేదాభేద రహితమయింది జ్ఞానభక్తి వైరాగ్యాలు శూన్యమైంది శరీరాలలో ప్రవేశించనిది వెళ్లిపోనిది సకల

దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు తనకు తానే తనంతది రెండోది లేక తనసంభంధం శరీరాలుగాక తనకుతానే ఆ శరీరాలయందు వున్న అనేక భేదాలుగాక సర్వకాలం భ్రాంచెయ్యకా వుండ పానమైన చెయ్యకా సుఖ దుఃఖాలయొక్క గంధమాత్రమైనాక మహా దైవ్యతమనే నామము ధరించక నానురూపములు లేక సార్వకాలం వక్కటైన వికారంలేక సదువుకోక మరచిపోక లింగత్రయంగాక యాలాగున్నదో ఆలాగేవున్నది యిహాన్ని లేదు శరీరంలేదు గనుక.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వక్కటేకాని రెండోశరీరం లేదు శరీరంవున్నంతసేపు స్వప్నావస్థేకాని రెండోఅవస్థలేదు వక్కటే దేహం వక్కటేఅవస్థ. నాలుగుదేహాలు నాలుగు అవస్థలులేవు గురు మూలంగా దృష్టాంతంసహా తెలుసుకుంటె అప్పుడే జాగ్రత అంతపర్యంతం లేక భూమికు మూలంవుంటె అయ్యే రెండోదియేమిలేదు అదివేదిఅంటె మూలంలేని యీ గుర్తెరిగే దేహ అయ్యే.

మూలంలేని యీగుర్తెరిగేశరీరం వున్నంతసేపూ కాశేపూ అయోని సంభవుల గుర్తెరుగుచుంది. వెంటనే మూలంలేని అయోని సంభవులుతోచి మెరుకవుడంగానే యేమిలేదు యోనిసంభవులు ఆలాగే గర్భిణి వద్దనుంచి తోచి నేను గుర్తెరుగంగానే యేమీలేదు కలతోచే అయోని సంభవులు తోచిరి కలతోచే యోని సంభవులుతోచిరి వారు యేమిలేదు వీరు యేమి లేదు. నాకు తనకు తానే దృఢంవున్నది.

శిష్యు॥ గాని నావర్తమానం కల్తగావున్నది.
గురు॥ అదే.

శిష్యు॥ నేను యోనిసంభవున్ను అయోనిసంభవున్ను కాశ్వేపు వారు వస్తే వారివలెనేవున్న వీరిని చూస్తే వీరివలెనే వున్న.

గురు॥ అట్టేవిచారిస్తే ఆదేహాలకు మూలం యేమీలేదు. యీ దేహాలకు మూలంయేమీలేదు. రెండూసమానము. అవ్వి శాశ్వతమయిన యీ బట్టబయలుకావు యివ్వి శాశ్వితమైన యీ బట్టబయలు కావు. అవ్వి మొదలుకొన వున్నవే యివ్వి మొదలుకొన వున్నవే.

వాటికి రెండు పోకడకద్దు. వీటికి రెండుపోకడకద్దుఅని నాకుతోస్తు వుంది. మంది అనుకోంగావింటున్నా.

గు॥ యథార్థంగా విచారిస్తే లోపకం మాత్రమేకాని ఆదేహా లకు మూలం యేమీలేదు. యీ దేహాలకు మూలం యేమీలేదు. రెండు సమానము ప్రవేశించేటందుకు స్థానంయేమీలేదు, మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేనుఅని అనుకున్నంతసేపు యీ ప్రకారానతోస్తుంది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యెపుడు యేమీలేకపోతె అప్పుడే యేమీతోచదు.

శిష్యు॥ తోచకుంటె.

గురు॥ సుఖం యేమీలేదు. దుఃఖం యేమీలేదు.

శిష్యు॥ అట్లైతే సర్వశూన్యమా.

గురు॥ అట్లైతె శరీరంలో కొంతవుంచుకొన్నా వుంచుకోవలె.

శిష్యు॥ వుంచుకుంటె.

గురు॥ శరీరం నావత్తు వుంచుంది.

శిష్యు॥ పెరుగుమొదా చల్లలో వెన్నవుంటె బాధయేమి.

గురు॥ అదియేమి. పెరుగుతరిస్తె పెరుగులోనే పుట్టేది.

శిష్యు॥ చైతన్యం దేహంవలన పుట్టింది. అని నేను యెన్నడువిన లేదు.

గురు॥ పెరుగు కవ్వంచాత తరిస్తే వెన్నపుట్టింది అని అందరికీ యెరుక. దేహంలోవున్నది గుర్తెరిగే జ్ఞానం దేహంవలన పుట్టుచుంది. త్రిగుణాత్మకం దేహాది పదార్థాలను గుర్తెరిగేజ్ఞానం సత్వగుణంవలన పుడుచుంది.

శ్లో॥ పదార్థవాచజ్ఞానస్య సత్వకార్యత్వాత్
శ్లో॥ సత్వాత్సం జాయతే జ్ఞానం మితిశ్రుతః
శ్లో॥ జాగ్రటవస్థాయాంచ జ్ఞానాధిక్యాత్ ॥
శ్లో॥ చిజ్జడం నామయోర్ద్రష్టాః ప్రోచ్యుతః॥

అని శృతిపున్నది. నాశరహితమైంది అచ్చుతుడు అనివున్నది.

శిష్యు॥ అట్లైనా.

శ్లో॥ జాతస్య హిధ్రువోమృత్యుః
అని వున్నదిగనుక శరీరంతోకూడా యేమీలేదు.
గురు॥ అట్టా యివిఅందరూ అనుకుంచూవున్నారు.
శిష్యు॥ గాఢచ్ఛిదలో మూలంలేని యీగుత్తారిగే శరీరం యేమిలేదు అటులెన్న వసిద్ధిదు.
గురు॥ శరీరం వున్నంతశేపే.
శిష్యు॥ శరీరం లేకుంటె.
గురు॥ యేమీలేదు.
శిష్యు॥ అట్లైతే సర్వశూన్యమా.
గురు॥ నిన, తానే యేమీలేదు. నన్నేమరిచావు.
శిష్యు॥ శరీరానకు మూలం యేమీలేకుంటె దానిబ్రతుకుయేమి.
గురు॥ యిప్పుడునాకే ఆ జ్ఞానిసంభవాలు కలలో అనేకశరీరాలు తోచినావి. గురుత్తేరిగేజ్ఞానంతోకూడ తోచినవి, వెంటనే. వెంటనే యేమి లేమ మన ఆశచాత శరీరాన్ని కొంతకట్టవేసుకుంటె వుండదలచిందేయేమి.
శిష్యు॥ కాదు అట్లైతే జ్ఞానందొడ్డని అనిప్రసిద్ధి యెందుకువున్నది.
గురు॥ లోకంలో పాపాత్ముడు ధర్మంచేస్తే మహాపొడ్డవాడు అని ప్రసిద్ధినలె కొంచం సగుణంవుంటే ప్రసిద్ధికద్దు.
శిషు॥ అబద్ధానకు జీవనం ప్రసిద్దే.
గురు॥ రాళ్లు దేవతలని ప్రసిద్ధిలేదా పూజలుచెయ్యరా గాందేవి పంచకంతాగరా, పెండతినరా, యీలాగే లోకవాడికే
శిష్యు॥ యీ బ్రహ్మబయలు సారిపోచుంగా యేమి.
గురు॥ మూలంలేని యీ గుత్తేరిగే శరీరంవున్నా యేమిలేదు. స్వాభావితమయినదానికి యేమిలేని యీగుత్తేరిగే శరీరానకు యేమిపాటి యేమిలేని యీ గుత్తేరిగే శరీరంలో కొంతనిబద్ధ కొంతఅబద్ధం అని పక్కలవలె మొలిగిందాకాయేమి. దాడిదవలె కూసిందాకాయేమి కక్కల వలె వర్లిందాకాయేమి.
శిష్యు॥ పశువులకు నోరులేదా యేమి.
గురు॥ మనుష్యులు మూలంలేని యీ గుత్తేరిగే శరీరాలలో

కొంతనిబద్ధి కొంతఅబద్ధమని అనుకోంగావిని ఛీ వారివలె మనము మాటలు ఆడవద్దుఅని వూరికే వుంచున్నది మనుష్యులు యెంతభ్రాంతులు అని అనుకొనుమాటె అబద్ధమని నోరుమూసుకొని మొదలుకొనలేని దానిలో పడ కుంచావి. అవిపుట్టని చావని దానియందే వున్నావి. దాన్ని యెరుగవు. మూలంలేని యీ గుత్తేారిగే శరీరం యేమిలేదు అని దృఢంగా యెరుగు.

శిష్యు॥ వున్నప్పుడు మనుష్యులతో సర్వసమానం.

గురు॥ సమానమేకాని అబద్ధాలుఆడవు. మూలంలేని యీగుత్తేారిగే శరీరంలో కొంతనిబద్ధి అనేది యెందుకు అనుకున్నావు.

శిష్యు॥ వాదించేటందుకు.

గురు॥ వాదనకు మూలంలేని యీ గుత్తేారిగే శరీరమే మూలం. మూలంలేని యీ గుత్తేారిగే శరీరం యేమిలేదని మేలుకుంటె వాదం యేమి,

శిష్యు॥ వాదం యేమిలేదు.

గురు॥ వున్నపరిపూర్ణం వాదించదుగదా.

శిష్యు॥ వాదించనే వాదించదు.

గురు॥ దానికి యెరుకఅనే జ్ఞానమేలేదు. కర్మాలు యెలాగుపుడు చావి,

శిష్యు॥ జ్ఞానకర్మరహితమైంది పరమతత్వం.

గురు॥ యిదితత్వం వంటిదికాదు లక్ష్యంలేనిబాట.

శిష్యు॥ లక్ష్యంవుంటె.

గురు॥ అన్ని లక్షణాలె లక్ష్యభ్రాంతిచేతనే అన్ని లక్షణాలు తోస్తు వున్నవి. లక్ష్యంలేని యీ బట్టబయలుకు యేమిలక్షణభ్రాంతి వున్నది. లక్ష్యం భ్రాంతికి మూలం.

శిష్యు॥ లక్ష్యంలేకుంటే.

గురు॥ లక్షణాలు అనే స్వరూపానకు మహాకోపం అందుకే లోకంలో గురియనికదు. లక్ష్యంవుండెనా లక్ష్యం తనకుసూటిగా లక్షణాను కల్పింస్తుంది.

శిష్యు॥ లక్ష్యంఅంటె.

గురు॥ స్వరూపం.

శిష్యు॥ లక్షణమంటే.

గురు॥ స్వరూపాన్ని కల్పించేది లక్ష్యంవున్నంతసేపు అనేకలక్షణాలు అనేకస్వరూపాలు తోస్తాని. అందుకే లక్ష్యంలక్షణాలు వకటే కార్య కారణాలకు భేదంలేదు. గనుక భ్రాంతికిమూలం అన్యోన్యం లక్షణమనే స్వరూపంలేకుంటె లక్ష్యంశూన్యమే, లక్ష్యంజ్ఞానం లక్షణంచేసేది కర్మలు జ్ఞానకర్మాలు, మోక్షసాధనాలు అని ప్రసిద్ధికద్దు. లక్ష్యాలక్షణ రహిత మయినది పరిపూర్ణం లక్షణంక్షేత్రం లక్ష్యంక్షేత్రజ్ఞస్వరూపం లక్షణ జన్యం లక్ష్యం.

శ్రు॥ సత్వాత్సంజాయతేజ్ఞానం.

అనివున్నదిగనుక,

శ్రు॥ లక్షణాపేక్షయాలక్ష్యం.

విషయంవుంటెనే విషయి దేహంవుంటేనేదేహిదృశ్యం వుంటెనే దృక్కు పోని ఆముచ్చటయేమి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంత సేపు వ్యవహారం. యిపుడు యీమూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు. అని సరిపుచ్చుకుంటె అప్పుడే పరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమైయున్నది.

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రబోధవేదాంత విచారణే
ఆత్మబ్రహ్మాపాది ద్వయదోషరహిత ప్రకరణము
త్రయోదశోధ్యాయః.

---

శ్రీగురుభ్యోనమః

# ౧౪॥ జీవేశ్వర ద్వయదోషరహిత ప్రకరణము.

---

శ్లో॥ రూపవస్తుమనోనాశో । యొమమొక్తోరఘుదృహ
విదేహముక్తోవాసా । విద్యతేనిష్కళాత్మకః॥

మూలంలేని యీగుర్తెరిగేశరీరంయేమిలేదు అని రాద్ధాంతమేసహస్ర

సిద్ధాంతము.

మూలంలేని యీ గుత్తారిగే శరీరం జీవుడు.

మూలంలేని యీ గుత్తారిగే శరీరం యీశ్వరుడు.

మూలంలేని యీ గుత్తారిగే శరీరమే ఆత్మబ్రహ్మ.

మూలంలేని యీ గుత్తారిగే శరీరం యేమిలేకుంటె యేమిలేని పరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమైయున్నది.

అదియేషువంటిదియుంటె యేమి లేనిపరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమయియున్నది.

జ్ఞానకర్మ శూన్యమయింది.

పుట్టని చావనిది.

రాకడ పోకడలేనిది.

సార్వకాలం వక్కటీరుగానే వున్నది.

మూలంలేని యీ గుత్తారిగే శరీరం వున్నదని భ్రాంతి వున్నంతశేపు అనేక శరీరాలు తోస్తూవుంచావి.

పరిపూర్ణానకు శరీరంలేదు గనుక యేమితోచదు.

కలతోచినా తనకుతానే యేమిలేదు అనిధృడంవున్నట్టు ధృడం మూలంలేని యీ గుత్తారిగే శరీరం యేమిలేదు అని ధృడం సంపాదించి వాటివలె అత్యంత శూన్యంగా మూలంలేని యీశరీరాన్ని తాత్పర్యం చేసుకోవాలె

శిష్యు॥ చేసుకుంటె,

గురు॥ కలతోచినది యేమిఅనుకోక యాలాగు సర్వశూన్యమయిపాయనో ఆలాగే మూలంలేని యీ గుత్తారిగే శరీరాన్ని సరిపుచ్చుకోవలె.

తాను యేమిలేకపోవలె.

అదికఠినంకాదు.

మూలంయేమిలేదు.

కలతోచినది మేలుకుంటె యాలాగో ఆలాగేశరీరాన్ని సరిపుచ్చుకోవలె.

శిష్యు॥ సరిపుచ్చుకుంటె.

గురు॥ భ్రాంతియేమిలేదు యీశరీరం కొంచంవుంచుకున్నా అంతా యెప్పటివలెనే పరిపూర్ణం యన్నటికి జాడరాదు.

యీశరీరంవున్నట్టు వున్నది యదేబట్టతెరవలెవున్నది దీనికివున్నదని భ్రాంతిదీనికే.

తనకుభ్రాంతి వున్నదనె భ్రాంతి యెన్నటికిలేదు.

శరీరంలోనిది.

పరిపూర్ణంగనుక గ్రహణం పట్టె విడిచె అన్నారు.

పట్టాలేదు విడువాలేదు.

సార్వకాలం వకటితీరుగా వున్నది

వున్నదిమరునకుంటే యీశరీరం యేమిలేదు.

యీశరీరం యేమిలేకుంటె వున్నది అదె.

వున్నదాన్ని సార్వకాలం మరువకవుంటావా యీశరీరం యేమిలేదని సరిపుచ్చుకుంచావా.

శిష్యు॥ నాకు యేమితెలియదు.

గురు॥ యేమిలేని యీశరీరంతోటి సాధ్యంకాదు అదిస్వతసిద్ధమై యున్నది.

శిష్యు॥ గనుక దీనికి యేలాగుయుక్తి.

గురు॥ కలదోచిన శరీరాలుయేమి ఆయె.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ అలాగె మూలంలేని యీగుతేరిగేశరీరం యేమిలేదు.

శిష్యు॥ యీలాగుఅనుకోనా.

గురు॥ అనుకొంచూవుంటె యీశరీరంవున్నట్టా లేదా.

శిష్యు॥ అనుకొంచువుంటె వున్నటె.

గురు॥ కలతోచినశరీరాలు మేలుకుంటే యేమయినా వున్నావి.

యేమిలేదు.

గురు॥ యేమిలేకుంటె యీశరీరాలు యేమనుకుంచావి.

శిష్యు॥ యేమిఅనుకోవు.

